## కరకాగారి పుస్తకాల జప్తు

బొంబాయి నవంబరు ౭

"బొంబాయిక్రానికిల్" పత్రికలో వ్యాసాలు వ్రాసేప్రసిద్ధుడైన డి.యఫ్.కరకాగారు రచించిన పుస్తకాలను పోలీసులు ష్టైలర్ కంపెనీ వారిశైత్యే పుస్తకవిక్రయశాలనుండి జప్తుచేసికొనిపోయిరి.

(ఈవిషయంలో బొంబాయిప్రభుత్వపు కార్య దర్శుల కార్యాలయమందును; పోలీసుకమీషనరు వద్దనువిచారణచేయగా, ఈపుస్తకాలను నిషేధించినట్టిఆజ్ఞ ఏదిగానికన్నట్లు తమకు తెలియదనిరని "ఫ్రీప్రెస్ జర్నల్" వార్తలు తెలుపబడినది. కాని పూనాలోను, కరాచిలోను పుస్తకశాలలలోకూడ ఇట్లే కరకాగారి పుస్తకములు జప్తుచేయబడి నవట)

## సావర్కర్. జిన్నా గారలకు సంభాషణము కుదిర్చేయత్నము

కరాచి, నవంబరు ౮

ఇటీవలక్రొత్తఢిల్లీకిపోయి తిరిగివచ్చిన డాక్టర్ "హానుక్ జాక్" వథ్వానిగారుహిందూమహాసభాధ్యక్షులగు వీరసావర్కరుగారికిని, ముస్లింలీగుఅధ్యక్షులగుజిన్నాగారికిని సంభాషణ నేర్పాటుచేయు యత్నములో తామునుమూహా పడవచ్చునని పత్రికల ప్రతినిధులకు తెలిపిరి. ఈసమావేశము రాబోవుముస్లింలీగుమహాసభయందు జరుగగలదని ఆశించిరి హిందూమహాసభయు ముస్లింలీగుచ్చుకలిసిన చో ఇండియాలో తిండికరువుబాధను తీర్చుటసులభ మగునని.

## ముస్లింలీగును వదలిన ముసల్మానులు

కరాచి, నవంబరు ౭

సింధుఅసెంబ్లీసభ్యుడైన సయ్యదుమహమ్మదలీగారు ముస్లింలీగునువదలి షేఖ్ అబ్దుల్ మజీదుగారి పక్షమునచేరినాడు, ఇంతవరకు సింధుఅసెంబ్లీలో ౧౧మంది క్రొత్తపార్టీకిచేరినారు. ఈపార్టీకిసింధు యూనియనిస్టుపార్టీ అనే పేరుపెట్టబడినదట.

## మళ్లీజిన్నా గారినే ముస్లింలీగు అధ్యక్షతకువరించుట

బెంగాలురాష్ట్రపు ముస్లింలీగుయొక్క కార్య సమితివారు నవంబరు౩ తేదినకూడి అఖిలభారతముస్లింలీగుకు మళ్లీజిన్నాగారినే అధ్యక్షునిగవరించినారు.

## బ్రిటిషు కామన్సు సభలో ఇండియా తిండికరువుచర్చ

బ్రిటిషుపార్లమెంటు కామన్సుసభలో నవంబరు౪ తేదిన ఇండియాలోనితిండికరువును గూర్చి చర్చ జరిగెను. ఉపన్యాసకులు తిండికరువుకు అధికారణ మైయుండవచ్చును, ఇదికారణమై యుండవచ్చును అనిచెప్పవారేగాని, ఈకరువుబాధను తొలగించుటకు నిర్ధానమును ఎవరును ఆచరణీయమైనదానిని సూచించరైరి. అమెరీగారుమాత్రము ఇండియాలో పూర్వపుఆర్థికస్థితిని ఇప్పటిఆర్థికస్థితిని వర్ణించి, జన సంఖ్య హెచ్చుచున్నదనిరి. మెక్ లారెన్సు అనే సభ్యుడు ఈతిండికరువు సేనలఅపజయమును పోలినచ్చునని యుద్ధమంత్రివర్గమునకు సూచించదలచినట్లు చెప్పిరి.

సైమూర్ కాక్సుఅను లేబరుపార్టిసభ్యుడుఇండియాలోనిజనులు బ్రిటిషు సార్వభౌముని ప్రజలేనని యు, కలకత్తాలోని జనులు మరణించుచున్నచో లండనులో జనులు మరణించుచున్నట్లేననియు, వైట్ హాలులో జనులుమరణించుచు, అక్కడికి తాలనులీవే సేటంతవరకు ఏమంత్రిగాని అక్కడికి పోజాలినిస్థితిఏర్పడినచో, వెంటనే అస్థితినిపోగొట్ట వలెనని జనులు గోలపెట్టుదురనియు, కాబట్టి ఇండియాకు గోధుమలను పంపించుటవల్ల జపానుతో యూదులేక అరుమాసాలు ఎక్కువగాయుద్ధం సాగించవలసిన అవసరంపడేటట్లున్నా, ఆ గోధుములనువెంటనే ఇండియాకు పంపించవలసినదనియు, అజనులుఅట్లు తిండిలేక మాడుచుండుట బ్రిటిషు వారిమర్యాదకు తగినదికాదనియు చెప్పిరి.

## మెహరలీ గారి జబ్బు స్థితి

బొంబాయిలో యూసుఫ్ మెహరలీగారి స్థితి నవంబరు౫తేది సాయంకాలానికి ఇంకా చెడిపోయి, వారికిగుండెబాధ చాలా గడుసారులుకలిగి, చాంతులుకూడఅయినవి. చాలా ప్రమాదస్థితి యనుచున్నారు. రాత్రివేళవారికి ప్రాణవాయువును గొట్టంతో ప్రాణవాయువును ఎక్కించిరి.

## గవర్నర్లకు వైస్రాయి ఆహ్వానము

నవంబరు౯వవారంలో ఢిల్లీలో ఇండియా ఆర్థిక స్థితినిగురించియు, తిండికరువును గూర్చియు ఆలోచించుటకై గవర్నరుల సమావేశము కావలెనని వైస్రాయిగారుపిలిపించినట్లు తెలియుచున్నది.

## పంజాబు ప్రభుత్వం తిండి ధాన్యాలను నిలవచేయుట

లాహోరు, నవంబరు ౩

పంజాబుప్రభుత్వపు ఆర్థికశాఖ మంత్రియగు సర్ మనోహరులాల్ గారు తిండిధాన్యములను కొన్ని నిలువచేయుటకై రూ౩ం లక్షలు ఖర్చుచేయుటకు మంజూరీకోరినారు. ఇదివరకే ఈ ధాన్యాలు కొన్ని నిలవచేయబడినవట. ముందు దిక్కులైన కలిగినప్పుడు వాటి ఉపయోగించుకొనబడునట.

పంజాబులో చక్కెర సమృద్ధిగాయున్నదనియు దానిని సరిగా అందరికిని అందునట్లు పంచుటకై ఏర్పాటులుచేయవలెననియు లాహోరు నగరమందు పంజాబురాష్ట్రపువాణిజ్యమండలి సమావేశమందు చక్కెరకంట్రోలరు యశ్.పి. మెహతాగారు ఉపన్యసించుచు చెప్పిరి.

## ఇండియాకు తిండిధాన్యాల ౫వ నౌక

నవంబరు౩ తేదిన ఇండియాయొక్క ఒకఓడరేవుకు తిండిధాన్యాలను అన్యదేశమునుండి తెచ్చు ఓడ ఒకటి చేరినది. ఇట్లుఅన్యదేశమునుండిఇండియాకుతిండిధాన్యములను తెచ్చిన నౌకలలో ఇది౫వది.

